పరగణాలలోని చాందాజిల్లాలో నాంధ్రభాషకు, కోంటావు, సాలేవారి, గోలరి అను పేళ్లున్నవి. ఈమూడును వేర్వేరుగ నుపభాషలుగా నెంచుటకు వీలున్నను వానియుచ్చారణమును, సుప్తిజంతవిధానమును నొక్కతీరుగనే యున్నవి. కర్ణాటక దేశములోను, బొంబాయి యందును, నాంధ్రమునకు సంబంధించిన కొన్ని యుపభాషలు కలవు. అవి కొన్నివృత్తులకు సంబంధించినవారి యాంధ్ర భాషా విభాగములుగా నున్నవి. బెల్గాము జిల్లాలో బేరాది, దాసరి, యనుభాషలును, బొంబాయి పట్టణమునందలి కామాఠిభాషయును, బొంబాయిరాజధాని, బేరారు మొదలగు ప్రదేశములలో సంచారశీలురగు నొకజాతివారు మాటలాడు వడరీ భాషయును నట్టివి. ఇవియెవ్వియుఁగూడ సాధారణవ్యవహారభాషకెక్కువ విలక్షణముగ నుండనిపోవుటచే వీనినిగూడఁ బ్రత్యేకోపభాషలుగాఁ బరిగణింప నక్కఱలేదు.

---

## గ్రాంథిక భాష, వ్యావహారిక భాష.

---

భాష కేవలము వాగ్రూపముగా నున్నంతకాలమును మార్పులను పొందుచుండుట సహజము. కాని, దానిని వ్రాతరూపమునఁ బెట్టిననాఁట నుండియుఁ గొంత స్థిరత్వ మేర్పడుచుండును. వ్రాతను చదువనేర్చినవారు పూర్వకాలపు శబ్దస్వరూపమును నిలబెట్టుటకుఁ బ్రయత్నించు చుందురు. ఈ ప్రయత్నము సంపూర్ణముగా సాధ్యము కాకపోవచ్చును. లిఖిత భాషా స్వరూపము గూడ వ్యవహారభాష ననుసరించి మారుచుండుట యసంభవము కాదు. కాని వ్యవహారభాషయంత శీఘ్రముగ లిఖితభాష మాఱఁ జాలదు. కొన్నినాళ్లు కాభాషయం దుత్తమగ్రంథములు వెలువడినచో నాగ్రంథముల యందలిభాష తరువాతివారికి మార్గదర్శకముగా నేర్పడును. దానికొక ప్రమాణత్వము గలుగును. సాధ్యమగు నంతవఱకుఁ దరువాతివా రాభాషనే యనుసరింపఁ బ్రయత్నింతురు. అయినను, వ్యవహారభాషనుబట్టి యాగ్రంథకర్తల గ్రంథములందలి భాషాస్వరూపమును మాఱుచుండును. భావములనుబట్టియు రుచులనుబట్టియు నాయాగ్రంథకర్తల నుడికారము మారుచుండుట వింత గాదు. అందుచేత నిదియే ప్రమాణ గ్రాంథికభాషయని నిరూపింప వీలు లేదు. తొలుదొల్త వ్యావహారికభాషయే గ్రంథస్థమై యుండినను నానాఁటికిని దానికిని గ్రాంథికభాషకును నంతర మెక్కువయగుట సంభవించి, యా రెండును వేర్వేరుగ నేర్పడుచుండును. గ్రాంథికభాష మిక్కిలి మెల్లగ మాఱుచున్న చుండ, వ్యావహారిక భాష ముందంజవేయుచుఁ దన సహజమార్గమున మార్పులఁ

పొందుచుండును. ఏభాషకైనను నీగ్రాంథిక వ్యావహారికావస్థా భేదములు తప్పవు. ఇతరదేశములలో గ్రంథకర్తలీయంతరము నెక్కువగా నుండనీయక వ్యవహారమునే లక్ష్యముగ నుంచుకొని యుండ, భారతీయభాషలు గ్రంథస్థ భాషనే పరమలక్ష్యముగఁ జేకొనియుండుటచే వ్యవహారభాషకును గ్రంథస్థ భాషకును మిక్కిలి యంతరమేర్పడినది. సంస్కృతభాషా ప్రాబల్యమె యిందుకు ముఖ్యకారణమని వేరే చెప్పనక్కఱలేదు. సంస్కృతభాష పాణిన్యాది వ్యాకరణములమూలమునను నిఘంటువులమూలమునను స్థిరీభూతమగుటచేతను, వ్యవహారభ్రష్టమగుటచేతను, నందు చాలనట్టి మార్పులు గలుగకుండెను. కాని నాఁటనుండి నేఁటివఱకుఁ బ్రవాహరూపమున వచ్చుచున్న భారతీయ భాషలుగూడ సంస్కృతభాషానుయాయులగుటచే గ్రంథస్థభాషకును వ్యవహార భాషకును నింతటి భేదమేర్పడినది. ఈ యంతరముండుటే మంచిదా కాదా యనువివాద మన్నిభాషలయందును గలదు. అన్ని ప్రాంతములయందును వ్యావహారికభాష పూర్వకాలపు గ్రాంథికభాషను గొంతవఱకైనను త్రోసి పుచ్చి, యాస్థానము నాక్రమించుకొనుచున్నది. ఇట్లుండుటచేఁ బూర్వగ్రాంథిక భాషతోడి పరిచయము సంపూర్ణముగ లేకపోవుటచేతను, వ్యవహారము నతిక్రమింప సాధ్యము కాకపోవుటచేతను, గ్రంథకర్తలు కొన్నికృతకరూపములఁ గల్పించుకొనుట సంభవించుచున్నది. ఈ కృతకరూపములు కొన్నిమొదల వ్యవహారములోఁగూడ స్థిరములగుట సంభవించుచుండును. ఈ రీతిగ నాంధ్ర భాషయందును వివిధములగు మార్పులు గలుగుచున్నవి. ఈ మార్పులన్నియు నేరీతిగ నేయే కారణములచేఁ గలిగినవో తెలియఁజేయుటయే యాంధ్ర భాషా చరిత్ర ముఖ్యోద్దేశము.

---

## ఆంధ్రులు.

---

ఆంధ్రులను జాతివారినిగుఱించి మనకు వేదకాలమునుండియు వినికి వచ్చుచున్నది. ఐతరేయ బ్రాహ్మణమున నీక్రింది వాక్యములున్నవి. "తస్య హ విశ్వామిత్రస్యైకశతం పుత్రా ఆసుః; పంచాశదేవ జ్యాయాంసో మధుచ్ఛందసః; పంచాశత్ కనీయాంసః; తద్యే జ్యాయాంసో న తే కుశలం మేనిరే. తాన్ అనువ్యాజహారన్ తాన్ వః ప్రజా భక్షీష్టేతి త ఏతేంధ్రాః పుండ్రాః శబరాః పులిందా మూతిబా ఇత్యుదంత్యా బహవో భవంతి వైశ్వామిత్రా దస్యూనామ్ భూయిష్ఠాః"—దీనిప్రకారము నాంధ్రులు విశ్వా

మిత్రుని సంతానమైనట్లును, వారు పుండ్ర, శబర, పులింద, మూతిబాది జాతులతో జన్యులుగాఁ బరిగణింపఁ బడినట్లును తెలియుచున్నది. మనుస్మృతిలో — "కారావరం నిషాదాత్తు చర్మకారం ప్రసూయతే। వైదేహకా దంధ్రమేదౌ బహిర్గ్రామప్రతిశ్రయౌ" అని యున్నది. దీనిప్రకారము ఆంధ్రులు వైదేహకులకు జనించినవారనియు, నాగు గ్రామములకు బయట నుండవలసిన వారనియుఁ దెలియుచున్నది. పురాణములలో నాంధ్రుల ప్రశంస గానఁబడుచున్నది. అంధ్ర, ఆంధ్ర శబ్దములు రెండును గానవచ్చుచున్నవి. వాయు మత్స్యపురాణములలో నంధ్రులను పేరును, వాయుపురాణమున నంధ్రియులను పేరును గానవచ్చుచున్నవి. భాగవతపురాణమున చాణూరమల్లుఁ డాంధ్రుఁడని యున్నది. మెగాస్తనీసు అను గ్రీకు రాయబారి యాంధ్రులను పేర్కొని యున్నాఁడు. అశోకుని శాసనములందు ఆంధ్రశబ్ద మున్నది. అశోకుని గిర్నారు శాసనములందు 'అంధ పిరిందేషు' అనియు, షాబాజుగఢీ శాసనములందు 'భోజపితినికేషు అంధ్ర పులిదేషు' అనియు నున్నది. క్రీ. పూ. 150 సంవత్సరపు హాథీగుంఫా శాసనమున నాంధ్రవంశములోని మూఁడవరాజగు శాతకర్ణి పేర్కొనఁబడి యున్నాఁడు. ఇతఁడు కళింగరాజగు ఖారవేలునకు సమకాలికుఁడు. కృష్ణాజిల్లాలోని చిన్నచిన్న యను గ్రామమునకు సమీపమున కృష్ణానదికి దక్షిణమున సముద్రతీరమున నాంధ్రరాజగు యజ్ఞశ్రీ గౌతమీపుత్ర శాతకర్ణి 27 వ రాజ్య సంవత్సరపు శాసనమొకటి దొరకినది. పులమావి యను నాంధ్రరాజు నేడవ రాజ్యసంవత్సరపు శాసనమొకటి కార్లెయొద్దను, మఱియొకటి భీల్సానగరము నొద్దను దొరకినవి. గుంటూరుజిల్లాలోని యమరావతియొద్ద గౌతమీపుత్ర శాతకర్ణి తరువాత రాజ్యము నేలిన వాసిష్ఠీపుత్ర శ్రీపులుమావి శాసనము చిక్కినది. క్రీ. శ. 554 లోని హరహా శాసనము నం దాతఁ డాంధ్రపతిని జయించినట్లున్నది. విగ్రహపాలుని పండ్రెండవ రాజ్యసంవత్సరపు శాసనమున — "మహత్తమోత్తమకుటుంబి పురోగాన్ మేదాంధ్ర చండాల పర్యంతం" అని యున్నది. దీని ప్రకార మాంధ్రులు మేదులతోడను చండాలురతోడను చేర్పఁబడినట్లు తెలియుచున్నది. క్రీ. శ. 1115 సంవత్సరపు జాజల్లదేవుని రత్నపుర శిలాశాసనమున నాంధ్రకిమిడి, కోసలాంధ్ర కిమిడి యను నామములు గానవచ్చుచున్నవి. క్రీ. శ. 1171 సంవత్సరపు మనగిహల్లు శాసనమున బిజ్జలుఁడు ఘూర్జర మగధ కళింగాంధ్ర సౌరాష్ట్ర వేంగీ రాజులను జయించినట్లున్నది. క్రీ. శ. 1358 సంవత్సరపు ఒక శాసనమున ముమ్మిడి నాయకునిగూర్చి "ఆంధ్రశ్రీశో దేశానంధ్రాన్ రక్షితుం" అని యున్నది. క్రీ. శ. 1368 సంవత్సరపు సింగనాయకుని అక్కలపూడి శాసనమున నాంధ్రదేశప్రశంస యున్నది. క్రీ. శ. 1466 సంవత్సరపు విద...

దేవుని శ్రీశైల తామ్రశాసనము నందాతనికి ద్రావిడాంధ్ర సుసీమాధిప అను బిరుదమున్నది.

పై శాసనములం బట్టియు నితరాధారములం బట్టియు నాంధ్రులు తొలుత మ్లేచ్ఛులుగాం బరిగణింపం బడియు నానాంటికి దేశము నంతటను వింధ్య పర్వత ప్రాంతములనుండి నానాముఖముల వ్యాపించి ప్రబలులై రాజ్యముల స్థాపించుకొన్నట్లును వారు వ్యాపించిన దేశమునకు నాంధ్రదేశమను సంజ్ఞ కుదురుకొన్నట్లును దెలియనగును. ఈ యాంధ్రదేశమును క్రీస్తు శకారంభ మున శాతకర్ణులను వారు జయించి రాజ్యమును స్థాపించినట్లు గొందఱు చెప్పు దురు. శాతకర్ణు లాంధ్రులేయను వాదముగూడ గలదు. ఈ శాతకర్ణులలో గౌతమీ శాతకర్ణులు, వాసిష్ఠీపుత్ర శాతకర్ణులు, మాఢరీపుత్ర శాతకర్ణులు, అను మూండు విధములవా రున్నట్లు రాజుల పేళ్లనుబట్టి తెలియవచ్చుచున్నది. ఈ యాంధ్రరాజ్యము తూర్పుతీరమునుండి పడమటితీరమునకు వ్యాపించినదో పడమటనుండి తూర్పుతీరమునకు వ్యాపించినదో యను విషయమున వివాదము లున్నవి. కృష్ణాజిల్లాలోని శ్రీకాకుళ మాంధ్రరాజులకు ముఖ్యస్థానమను వా రాంధ్రులు పశ్చిమమునకు వ్యాపించినట్లు చెప్పుదురు. నాసిక ముఖ్యస్థాన మను వా రాంధ్రులు తూర్పునకు వ్యాపించినట్లు చెప్పుదురు.

ఇట్లాంధ్రులనియు నాంధ్రదేశమనియు వ్యవహరింపబడుచున్న శబ్దము లాంధ్రరాజుల శాసనములందు కానరాకుండుట విచిత్రముగా నున్నది. ఆంధ్రభాషయను పేరుగూడ నాంధ్రరాజుల శాసనములందు గానరాదు. తిక్కనకాలమువఱకును తెనుంగున కాంధ్రనామమున్నట్టు నిదర్శనములు లేవు. ఆంధ్రరాజుల శాసనములన్నియుం బ్రాకృతభాషయం దున్నవి. ఇవి నాసిక కార్లేయను పశ్చిమతీర ప్రదేశములనుండి గోదావరీ కృష్ణానదీ మార్గముల ననుసరించి యిప్పటి యాంధ్రదేశమునకు గర్భమనదగు గుంటూరు మండలమున నున్న అమరావతి, ధాన్యకటకము, నాగార్జునకొండ మున్నగు ప్రదేశము లందు నిబిడములై తూర్పు సముద్రతీరమున కృష్ణానదీముఖభూములవఱకు వ్యాపించి యున్నవి. ఈ శాసనముల భాష యాంధ్రభాష యెట్లు మారినదో నేటి తెలుంగు రూపమును దాల్చువఱకు నెట్టి పరిణామములం బొందినదియుం దెలిసి కొన వచ్చును. ఈ యాంధ్రదేశపు భాష యెట్టి ప్రాకృతమో యనువిషయమున వివిధాభిప్రాయములు కలవు. క్రీస్తు శకారంభమున నీ ప్రదేశమంతయు బౌద్ధమతాక్రాంతమై యున్నట్లు చరిత్రమువలనం దెలియుచున్నది. సింహళ ద్వీపమునం దేర్పడిన త్రిపిటకములను బౌద్ధ ధర్మగ్రంథముల భాష పాళిభాష యని పిలువంబడుచున్నది. ఈ పాళిభాష యెక్కడిదను విషయమును ఓల్డెన్ బర్గు పండితుండు తాను సంపాదించిన త్రిపిటకములను గ్రంథము రెండవ సంపుట

అ = ఇ—ససిరీక (చంచరికా)

అ = ఒ—యోణకస (యవనకస్య)

అఉ = ఓ—చఉత్థ, ఛోత్థ (చతుష్పథే)

అప = ఓ—ఓవరకో (అపవరకః)

అయా = ఏ—పరిహాగేర (పరిహారగయాః)

అవ = ఓ—అనోమస (అనవమృశ్య) ; [illegible] ([illegible])

ఆ = అ—అపరంత (అపరాంతే) ; ఘరిస [illegible] ([illegible]) ; [illegible] మస (పరాక్రమస్య.)

ఇ = ఇ—సిద్ధం (సిద్ధం) ; వాసిగీ (నాసిక్యే.)

ఈ = ఈ—ససరీక (చంచరీక.)

ఈ = ఇ—పతిగయ్హ (ప్రతిగృహీత = [illegible] పతిగయ్హ.)

ఉ = ఉ—రిపు (రిపు.)

ఉ = ఇ—పురిస (పురుష.)

ఉ = ఈ—దీహీతు (దుహితుః.)

ఋ = అ—కణ్హగిరి (కృష్ణగిరి) ; నఘ ([illegible]) ; [illegible] ([illegible]) తతియే (తృతీయే) ; పతిగహీత (ప్రతిగృహీతా.)

ఋ = ఇ—సదిసే (సదృశే) ; కితా[illegible] ([illegible].)

ఋ = ఇ = యి—పులమాయిస (పృథుమాత్సర్యస్య.)

ఋ = ఉ—వుధిక (వృద్ధికే) ; ముదమాన (మృద్యమానస). మాతు (మాతృ.)

ఋ = ర—రసి (ఋషి) ; గతు (ఋతు).

ఋ = రు—రుతుం (ఋతౌ.)

ఋ = రి—రాజరిసి (రాజర్షి.)

ఏ = ఏ—నివిసేన (నిర్విశేష.)

ఏ = ఇ—మహింద (మహేంద్ర.)

ఏ = ఆ—వాథవాను (వాస్తవ్యేషు.)

ఏ = ఓ—దో (ద్వే) ; ఇచ్చట [illegible] గలిగినది.

ఐ = ఏ—వేజయంతియో (వైజయంత్యాః) ; [illegible] (వైశాఖ మాసె) ; చేతియ (చైత్య.)

ఐ = ఎ—నెకమ (నైగమ.)

ఐ = ఈ—ఏకీకస (ఏకైకస్య.)

ఓ = ఉ—ఏకునవీస (ఏకోనవింశతి.)

ఓ = ఓ—చకోర (చకోర); తోయ (తోయ.)

ఔ = ఓ—గోతమీా (గౌతమీా); పోర (పౌర); కోసిక (కౌశిక.)

ఔ = ఒ—ఒతరాహా (ఔత్తరాహా.)

---

## హల్లులయందలి మార్పులు.

---

క = క—కాల (కాల.)

క = గ—గిలాణస (క్లిన్నానాం.)

ఖ = ఖ—సుఖ (సుఖ.)

ఖ = ఘ—లేఘుక (లేఖక.)

గ = గ—గిరి (గిరి); నేగమ (నైగమ.)

గ = క—సకిరి (సగిరి) ఈ మార్పు పైశాచీభాష ననుసరించి యున్నది.

చ = చ—చకోర (చకోర.)

చ = స—సేటిగిరి (చైత్యగిరి); ససిరీక (చంచరీక.)

జ = జ—రాజ (రాజ.)

ట = ట—వాట (వాట.)

ట = డ—కుడుంబినియ (కుటుంబిన్యాః.)

డ = డ—మండల (మండల.)

డ = ళ—గరుళ (గరుడ); సోళస (షోడశ.)

ణ = ణ—బమ్హణస (బ్రాహ్మణస్య.)

ణ = న—పురిసానం (పురుషాణాం.)

త = త—గోతమీా (గౌతమీా); తతియే (తృతీయే) - ఈ రూపము పైశాచీభాష ననుసరించినది-

త = ట—పటిపుణ (ప్రతిపూర్ణ); కటా (కృతా); కుమారాటస (కుమారాతస్య.)

త = థ—పథ (పతత్.)

త = అ = య—పతిగహ్యయ (ప్రతిగృహీత = పతిగహీఅ = పతిగహీయ = పతిగయిహా = పతిగహ్యయ.)

త = ద—సదకణి (శాతకర్ణి.)

త = డ—పడిక (ప్రతీక); అపడి దాతనా (అప్రతి [illegible])

త = ర—సతరి (సప్తతిః.)

థ = ళ—పుళుమాయిన (పృథుమాత్ర[illegible].)

ధ = ర—సురఠ (సురథ); [illegible] ([illegible].)

థ = ద—మదనస (మథనస్య.)

ద = ద—దివసే (దివసే) మంగగ ([illegible].)

ద = ర—తేరస (త్రయోదశ); [illegible] ([illegible].)

ద = య—పాయూన ([illegible].)

ధ = ధ—సిద్ధం (సిద్ధం.)

ధ = వ—నిధి (నివి) - ధ కారము వకారముగ [illegible]. నిధి నిఇ, అయి వకారమాగనునుగా వచ్చినది.

న = న—వాహన (వాహన.)

న = ణ—విచిణ (విచ్ఛిన్న) [illegible] ([illegible]); [illegible]యుత (నియుక్తా); మహామతేణ (మహామాత్యేన), [illegible] ([illegible]); మహాసేణాపతిణీయ (మహాసేనాపత్న్యః.)

ప = ప—పీత (పీత); పటిపుణ (ప్రతిపూర్ణ.)

మ = మ—పంచమే (పఞ్చమే); ముంనగ ([illegible].)

య = య—తోయ (తోయ); మలయ (మలయ)

ఇ = ఇ—పవఇత (ప్రవర్ధయిత్రీ.)

య = చ—పారిచాత (పారియాత్ర); - [illegible] [illegible] భాష ననుసరించి యున్నది.

య = జ—భరిజాయ (భార్యాయాః.)

ర = ర—రాజ (రాజ.)

ర = ల—నాలిగేరాన (నారికేలానాం.)

ల = ల—మలయ (మలయ.)

ల = ర—నాలిగేరాన (నారికేలానాం.)

వ = వ—దివసె (దివసే.)

వ = బ—బితీయె (ద్వితీయే.)

వ = అ = య—భయంత (భదన్తః = భఅంత - [illegible])

వృ = ఉ—ఉసభదతేన (వృషభదత్తేన.)

శ = స—ఏకునవిస (ఏకోనవింశతిః); సాససస ([illegible]); [illegible] (శుశ్రూషా); నివిసేస (నిర్విశేష); సక (శక); [illegible] ([illegible]); [illegible] ([illegible]);

సాతవాహాన (శాతవాహన); నిరవసేస (నిరవశేష); సిరసి (శిరసి); దాసక (దాశక); బావసక (బ్యావశక); సత (శత), సోళస (షోడశ); కోసిక (కౌశిక.)

శ్య = స్స—ఆపావేస (ఆప్రావేశ్యమ్); అనోమస (అనవమృశ్యమ్.)

ష = ఛ—ఛ్ఛాగే (షష్ఠే.)

ష = స—నిసూనస (నిషూనస); సహలస (సహలుష); అంబరీస (అంబరీష); నివిసేస (నిర్విశేష); ఉసభదత్తేస (ఋషభదత్తేన); సోళస (షోడశ.)

స = స—గినస (గినసే); సిద్ధం (సిద్ధం); సమసారస (సమసారస్య.)

ః = ఓ—గామో (గ్రామః); తతో (తతః.)

హా = హా—హిమవత (హిమవత్.)

హా = ఖ—ఖఖరాత (క్షహరాత.)

---

## సంయుక్తాక్షరములు.

---

క్త = త్త—వతవ్యా (వక్తవ్యః); విభతా (విభక్త.)

క్ర = క—వికమ (విక్రమ); పరకమ (పరాక్రమ.)

క్ష = ఖ్ఖ—ముఖ్ఖ (ముక్ష.)

క్ష = ఖ—ఖహారాటస (క్షహారాతస్య.)

క్ష = ఖ్ఖ—అఖ్ఖయా (అక్షయా); ఉసగఖ్ఖితో (ఉసగక్షితః); పఖ్ఖే (పక్షే); అఖ్ఖయాం (అక్షయాం); యాఖ్ఖ (యాక్ష); రఖ్ఖస (రాక్షస); నఖ్ఖత (నక్షత్ర); దఖ్ఖిస (దక్షిణ.)

క్ష = ఖ—ఖతస (క్షత్రస్య); ఖతియ (క్షత్రియా); ఖఖరాత (క్షహరాత.)

జ్ఞ = ఞ—ఞాయతే (జ్ఞాయతే.)

జ్ఞ = ఞ్ఞ—యఞ్ఞ (యజ్ఞ); అఞ్ఞాతియ (అజ్ఞప్తా య); రఞ్ఞో (రాజ్ఞః.)

జ్ఞ = ణ—ఆణత్తం (ఆజ్ఞప్తమ్.)

జ్ఞ = న—ఆనపయతి (ఆజ్ఞాపయతి.)

జ్య = జ్జ—భోజ్జా (భోజ్యాః); సుజ్జమాన (సృజ్యమాన.)

త్త = య్య—దేయ్య (దత్త.)

త్స = స్స—తస్సర (తత్సర.)

త్య = త్త—మహామత్తేణ (మహామాత్యేన.)

త్య = చ్చ—అమచ్చ (అమాత్య.)

త్య - త్త = ట్ట—సెట్టగిరి (చైత్యగిరి = చెత్తగిరి = సెట్టగిరి.)

త్ర = త్త—నఖత్త (నక్షత్ర); చిత్తేణ (చిత్రేణ) ; సతుసంఘస (శత్రు సంఘస్య) ; పుతస (పుత్రస్య.)

త్ర = త్త—ఖత్తియ (క్షత్రియస.)

త్త్వ = త్త—సత్తసం (సత్త్వానామ్.)

త్స = స్స—ఉస్సవ (ఉత్సవ.)

త్స = చ్ఛ—సంవచ్ఛరే (సంవత్సరే.)

త్స్య = చ్ఛ—మచ్ఛ (మత్స్య.)

ద్య = జ్జ—విజ్జాధర (విద్యాధర.)

ద్ర = ద్ద—చంద్ద (చంద్ర); మహిద్ద (మహేంద్ర): సముద్ద (సముద్ర.)

ద్వ = ద—దో (ద్వే.)

ద్వ = బ—బారసహ (ద్వాదశ) ; బే (ద్వే.)

ధ్య = ఝ్ఝ—విం ఝ్ఝ (వింధ్య.)

బ్ద = ద్ద—సద్దస (శబ్దస్య.)

భ్య = బ్భ—అబ్భంతరం (అభ్యంతరమ్.)

ర్ఘ = ఘ్ఘ—దిఘ్ఘ (దీర్ఘ.)

ర్జ = జ్జ—అజ్జున (అర్జున) ; ధమ్మాజ్జిత (ధర్మార్జిత.)

ర్ణ = ణ్ణ—చాతువణ్ణ (చాతుర్వర్ణ) ; పటిపుణ్ణ (ప్రతిపూర్ణ.)

ర్త = త్త—నివత్తన (నివర్తన) ; నివత్తితా (నివర్తితా.)

ర్థ = ద్ద—చోద్దె (చతుర్థే.)

ర్ధ = ద్ధ—గోవద్ధనె (గోవర్ధనే) ; ధనుద్ధరస (ధనుర్ధరస్య) : వివద్ధనస (వివర్ధనస్య.)

ర్ప = ప్ప—దప్ప (దర్ప.)

ర్భ = బ్భ—గబ్భం (గర్భం) ; నిబ్భర (నిర్భర) : విదబ్భ (విదర్భ.)

ర్గ = గ్గ—చతుగ్గబ్భం (చతుర్గర్భం.)

ర్మ = మ్మ—ధమ్మ (ధర్మ.)

ర్య = య్య—ణియ్యాచితం (నిర్యాచితం.)

ర్వ = వ్వ—గంధవ్వ (గంధర్వ) ; చాతువ్వణ్ణ (చాతుర్వర్ణ) : నివ్విసేస (నిర్విశేష) ; సవ్వ (సర్వ) ; పవ్వత (పర్వత.)

ర్శ్వ = స్స—పస్సే (పార్శ్వే.)

ర్ష = స్స—వస్సపత్తే (వర్షపత్తే) ; దుప్పధస్సనీయ (దుష్ప్రధర్షణీయ.)

ల్య = ల్ల—ముల్లేన (మూల్యేన.)

## షష్ఠీ బహువచనము.

---

భదావనీయానం (భద్రావనీయానాం), పవజితాన (ప్రవ్రజితానాం) తెకిరసిణ (తైకిబుషీణాం); పతివసతానం (ప్రతివసతాం); వాసాన (వర్షాణాం); గిహ్మాణ (గ్రీష్మాణాం); సవసానం (సవసానాం); ఉతమభద్రకానం (ఉత్తమ భద్రకానాం); ఖతియానం (క్షత్రియాణాం); భిఖూనం (భిక్షూణాం); తెరణ్హుకానం (త్రిరశ్మికానాం), వసంతానం (వసతాం); వసఉధాన (వాస్తవ్యానాం), నాలిగేరాన (నారికేలానాం); దేవానం (దేవానాం); బాహ్మణానం (బ్రాహ్మణానాం); సహసణం (సహస్రాణాం); గిలాన (క్లిన్నానాం); హేమతాణ (హేమంతానాం); నాసికికానం (నాసికకానాం);

---

## సప్తమ్యేకవచనము.

---

గిహ్మాణపఖే (గ్రీష్మాణాం పక్షే); బితీయే (ద్వితీయే), తేరసే (త్రయోదశ్యాం), తిరణ్హుమ్హి (త్రిరశ్మిని); అనుగామిమ్హి (అనూగామిని); రాజిని (రాజని),

---

## సప్తమి బహువచనము.

---

కఖుడీసు (కఖుడీషు); వాస్తవ్యసు (వాస్తవ్యేషు); ఆగతానాగతాసు (ఆగతానాగతేషు.)

---

## క్రియలు

---

ఈక్రింది క్రియారూపములు కానవచ్చుచున్నవి. భవిసంతి (భవిష్యంతి); నిబధాపేథ (నిబద్ధాపయథ); వసతి (వాస్యతే); కసతే (కృష్యతే)—ఆత్మనేపదిరూపమిది యొక్కటియే కానవచ్చుచున్నది.

అపావేస (అప్రావేశ్యం); అనోమస (అనవమృశ్యం.)

---

## సర్వనామములు.



అమ్హేహి (అస్మాభిః); అమ్హ (అస్మాకం.)

ఏధ (ఏతత్); ఎతత (ఏతత్), ఏతో (ఏతత్) ?

ఏతహి, ఏతేహి (ఏతైః); ఏతస (ఏతస్య); ఇమేస (అస్య) ?

సో (సః); నేన (అనేన); య (యద్)

---

## అవ్యయము.

---

దాని (ఇదానీం.)

---

## సంధి.

---

అప + అవసితం = అపయవసితం.

---

## కారకము.

---

నమ భగతస జినవగస బుధస (నమోభగవతే జినవరాయ బుద్ధాయ.)

---

## ఈక్రింది గ్రామముల పేళ్లు కానవచ్చుచున్నవి.



చలిసీలణ, నాసిక, ధంభిక, దసపుర, ఛాకలేప, దాహానుకాసనగర, కేకాపుర, ఉజేని, కాపురాహార, చిఖలపద్ర, పిండీతకానడ, సువణ్ణముఖ, రామతీర్థ, గోవర్ధన, శోర్పారగ, భరుకచ్ఛ, బెనాకటక, ధనకట, సామలిపద, సుదసన, నవనర, పిసాజపతకం.

---

## ఈక్రింది మనుష్యుల పేళ్లు కానవచ్చుచున్నవి.

---

ధమ్మదేవ, ఈంద్రాగ్నిదత, మాఢలీపుత, శివ దత్తాభీర, అభీర, ఈశ్వర సేన, సకగివమ్మ, గణపక, ఠేభిల, విసవర్మ, సకనిక, శివమిత, రామణక, హాలిదత, భటపలికా, మహాహకసిరి, అరవఅయ, అనీయతణక, కపణణక

సదాసిరీ, సాదవాహన, కన్హ, మహ్మా, భవగోప, బొపకి, దామచిక, పులుమాఇ, ధణామ, సాతకణి, విణ్హుదత, ఖుహారాత, ఖుతప, నహాపాన, దీసీక, ఉషవదాత, గోతమిపుత, సదకణి, విణ్హుపాలిత, అవరకఖుడి, సివగుత, మిధున, పుళుమవి, సవస.

---

## ఈక్రింది సంఘములపేర్లు కానవచ్చుచున్నవి.

---

ఉత్తమభాద్ర (యోధులసంఘము); (తేకిరసి, ఒక యతులసంఘము); భద్రాయనీయ (భిక్షుసంఘము); చతిక (ఒక భిక్షుసంఘము); కులరిక శ్రేణి (ఒక యంత్రిక శ్రేణి,) తిలపిషక శ్రేణి, (వృత్తులకు సంబంధించిన సంఘములు.)

---

## పర్వతములు.

---

తిరణ్హు, గోవధన,

---

## నదులపేళ్లు.

---

బాణ్ణాశా, ఇబా, పారాదా, దమణ, తాపీ, కరబేణా, దహానుకా,

పైదానినిబట్టి యాంధ్రరాజుల శాసనములభాష పాలిభాషకు మిక్కిలి దగ్గఱగనున్నట్లుఁ దెలిసికొనవచ్చును. నాసికయందేకాక నేటి యాంధ్రదేశమునఁ గానవచ్చిన యాంధ్రరాజుల ప్రాకృత శాసనముల భాషయుఁ బైదానినే పోలియుండును. ఆంధ్రదేశమున నశోకుని శాసనములు మొన్నటివఱకును దొరకలేదు. అనంతపురముజిల్లాలోని గుత్తి కేడుమైళ్ల దూరముననున్న యెఱ్ఱగుడి గ్రామమునకు సమీపమున చిన్నగుట్టలపై చెక్కఁబడియున్న యశోకుని పదునాలుగు శిలాశాసనములను నేను స్వయముగ ప్రథమమునఁ గనుగొని వాని ప్రతులనెత్తి చేదివితిని. అందలి రెండుశాసనముల నీక్రింద నుదాహరించుచున్నాను.

---

## ఏడవ శిలాశాసనము.

---

1. దేవానంపియే పియదసినే లాజా సవతా ఇఛతి.
(దేవానాంప్రియః ప్రియదర్శీ రాజా సర్వత్ర ఇచ్ఛతి.)

2. సవపాసండ వసేయు సవే హి తే సయమం భావసుధిం చా
(సర్వేపాషండా వసేయుః సర్వే హి తే సంయమం భావశుద్ధిం చ.)

3. ఇఛంతి జనేచు ఉచావుచఛందే ఉచావుచలాగే తే సవం ఏక [దేశం పి
(ఇచ్ఛంతి జనః తు ఉచ్చావచచ్ఛందః ఉచ్చావచరాగః తే సర్వం [ఏకదేశమపి.)

4. కఛంతి విపులె పి చు దానే అస నథి సయమే భావసుధి కిటనాతా
(కరిష్యంతి విపులమపి తు దానం యస్య నాస్తి సంయమో భావ [శుద్ధిః కృతజ్ఞతా.)

5. దిఢభతితా చా నిచే బాఢం
(దృఢ భక్తితా చ నీచా బాఢం.)

---

## తెనుఁగు.

---

దేవానాంప్రియుఁడు ప్రియదర్శిరాజు సమస్తజనులను తమ యిచ్ఛ వచ్చినచోట వసింపవచ్చునని కోరుచున్నాఁడు. వీరందఱును సంయమమును భావశుద్ధిని, కోరుదురుగదా. కాని జనులు వేర్వేరు కోరికలను, వేర్వేరు రాగములను కలిగిఉందురు. వారు తమధర్మములలో అన్నిటినిగాని, కొన్నిటిని మాత్రముగాని నిర్వర్తింతురు. విపులమైనదానమును, సంయమమును, మనశ్శుద్ధియు, కృతజ్ఞతయు, దృఢభక్తియు లేనివారు తప్పక నీచులగుదురు.

---

## 11–వ శిలాశాసనము.

---

1. దేవానంపియే హేవం ఆహా నథి ఏదిసే దానె ఒదిసే ధయుదానే [ధంమసంథవే.
(దేవానాంప్రియః ఏవం ఆహా నాస్తి ఈదృశం దానం యాదృశం [ధర్మదానం ధర్మసంస్తవః.)

2. ధంమస విభాగే ధంమసంబంధే తత ఏస దాసభటికసి.
(ధర్మసంవిభాగః ధర్మసంబంధః తతః ఏషా దాసభృతకే.)
సంమ్యాపటిపతి మాతాపితు సుసున.
(సమ్యక్ప్రతిపత్తిః మాతాపితృ శుశ్రూషా.)

3. మిత్తసంథుత నాతికానం సమంస బంభనానం దానే పానానం.
(మిత్రసంస్తుత జ్ఞాతికానాం శ్రమణ బ్రాహ్మణానాం దానం [ప్రాణానాం.)

అనాలంభే ఏస వతవియే పితినాపి.
(అనాలంభః ఏతద్ వక్తవ్యం పితృణాపి.)

4. పుతేనపి భాతినాపి సువామిక్యేపి మిధసంథుథేనాపి అపటి.
(పుత్రేణాపి భ్రాత్రాపి స్వామికేనాపి మిత్రసంస్తుతేనాపి ప్రాతి.)
వేసియేనా ఇయం సాధు ఇయం కటవియే సే తథా.
(వేశికేన ఇయం సాధుః ఇయం కర్తవ్యం స తథా.)
కలంత హిదలోకే చ కం ఆలథే.
(కుర్వన్ ఇహలోకే చ ఆరాద్ధవాన్.)

5. హోతి పాలత చ అనంతపునా ప్రసవతి తేన ధంమదా.
(భవతి పరత్ర చ అనంతపుణ్యాం ప్రసూతే తేన ధర్మదా.)

6. నేన
(నేన.)

---

## తెనుఁగు.

దేవానాం ప్రియుఁ డిట్లు చెప్పుచున్నాఁడు. ధర్మదానము, ధర్మసంస్తవము, ధర్మవిభాగము, ధర్మసంబంధము అనువానిని పోలిన ధర్మములేదు. అందుచేత దాసభృత్యులయెడల ప్రతిపత్తి, తల్లిదండ్రులశుశ్రూష,మిత్రులు, పరిచితులు, బంధువులు, శ్రమణులు, బ్రాహ్మణులు అనువారికి దానము, ప్రాణులను హింసింపకుండుట, (అనునదే ధర్మవ్రతము) ఈ ధర్మవ్రతమును గుఱించి తండ్రితోఁగాని, కొడుకుతోఁగాని, సోదరునితోఁగాని, పరిచితునితోఁగాని కేవలము ఇరుగుపొరుగువారితోఁగాని, ఇది సాధువు,' ఇది,' కర్తవ్యము, అని చెప్పవలెను. ఇట్లుచేసి, అధర్మనాశమువలన ఈ లోకమందు సౌఖ్యమును, పరలోకములో అనంతపుణ్యమును పొందును-

ఈ క్రిందిశాసన మాంధ్రదేశమునకుఁ బ్రత్యేకముగా నశోకునిచే వ్రాయఁబడినది దీనిప్రతి భారతవర్షమున మఱియొందును గానరాదు.

1. (అసక) స దేవానంపియే హే పి మ చ ఏకాని.
(అశోకః దేవానాంప్రియః ఆహ అఖి మమ చ ఏకోన.)

2. తెన సంవచర వసంకర కస న ౼ కస నాజకయిూాయి.
(త్రింశద్ సంవత్సరే పాసంకృతం కీదృశం నఃకార్యస్య ప్రయోజ
[నాయ.)

3. పు ససాసతే కయం ఖు సవఛలే యమాయూ సంఘోసధసయే.
(పున స్స శా_స్తి కార్యాంఖలు సంపత్సరేఽయమాజ్ఞా సంజ్ఞావ
[ధారితా.)

4. మాలభాయే మునీసాసనలేకా చు స మితేకే సమే వృథం ఏతే.
(మమలాభాయ మనుష్యశాసనలేఖా తు స మిత్ర్కే ప్రేమ
[వృద్ధం ఏతే.)

5. దకనపిపుక దేవపిత రే నిరరాసి సగాభాసకమస గ–
(దక్షిణ ... ... దేవపితరో నిర్గతాఃస్యుః శుభ ప్ర క్ర మస్య ధ–)

6. రామమోనేన సాకియే వూ గత మే ఏనకోయే కసనేన.
(రా మమ అనేన సాకం యే వా అస్థానూః యోనకేనాసి యా
[దృ కీదృశ్యా.)

వూ పమయూ.
(వా ఉపమాయూ.)

7. అపి వ నం పవిఖో సధాకే పుతె మూభో లశో నాయు చ.
(అపి వా అస్మాన్ ప్రవీక్ష్య శ్రద్ధాంకే పురా మమ అభవన్
[అశోకస్య చ.)

అథాయే ఏయం.
(అర్థాయ ఇయం.)

8. హావం యం పకమ హాోభవం పు దక మహాఘకా ఇమం పి.
(ఏవం యః ప్రక్రమో భవత్యభూత్ పునః దక్షిణ మహార్ఘకాః
[ఇమమపి.)

ఏకమోవ అ ఇ.
(ఏకమేవ అతి (ను ?) )

9. గవ్రూపి చే యిథం నభేతదమోమప ఛేచకేశాష ఎపిన్రుస.
(గమిష్యంత్యపిచేత్ ఇమం అభీతధర్మమస పత్స్య భ్రాతృ
[జనా.)

జమే వుభా.
(నావుభా.)

10. యదేకే ఓనపేం భవాయే రం నహావా వాఉసో వా.
(య దేకే అవనిపా భవేయుః రాజానః యే వ్యాపృషో వా.)
ఏఖసి భాఅపపధియా దేయా వివ
(సగ్ధయిష్యంతి భావప్రవృద్ధ్యై ధియా వివ-)

11. ఏనే ఆదింపిస జనో దత మభోడస అతనం ధనపియానె సావం-
(గ్ధనా అర్థమపి న జనో దత్త మభూ త్తస్య అర్థానాం ధనప్రియా
[నిశ్శాలవ-)

యఇ.
(ఋతవ్యాః.)

12. సంయస సుతిరా వుతాని చా సుసితవియే జయేయ.
(ప్రజ్ఞాన సుష్ఠిః నృత్తాః చ సుశ్రావయితవ్యాః జయాయ.)
వధ ఏయే అ౹ సయధాకదే.
(వృద్ధ్యై ఏవం ప్రయత్నే కృతం.)

13. సిసువాయ హామేవ గచు పు సుసువియావహ భడే.
(సుశ్రావణేన అహమేవ గచ్ఛామి పునః శుశ్రావణాయ వా
[అహంభటః.)

ఆతథకథా అపి ఆయే పినవా.
(యథా (తథా) కథమపి ఆగమిష్యామి పునర్వా.)

14. సుసుమ ధంమశన పవతితని యయేచు దయాని య దయితవయ.
(శుశ్రూషా ధర్మశాసన ప్రవర్తితాని యానియాని తు దత్తాని
[యాని హాతవ్యాని.)

సవే వేతివయే.
(సర్వాణి వర్తితవ్యాని.)

15. యథపథి యాఛే సాసోకారునకోభి ఇయం సుంసుసిత తపంతి.
(యథాపథి యాదృశినః ఉపాసకారిణః అపి ఇమం శ్రావయిష్యంతి.)
పయూథ దేవానంపియ వనేన హ
(ప్రయుతాః దేవానాంప్రియ వచనేన అ-)

16. థ అంతేవాసిని యారాసా ధంమవధకి భికాని యథారపవియ.
(థ అంతేవాసినః యాదృశా ధర్మవర్ధకా భిక్షుకాః ... ... ...)
అనాని వేసుఘ హాంవనిపయా అవమ

... ... ...

17. యస యధా వంఝోన ఆచుదయస నాభాకా భాభవారయే యాద-నా పతాయనాయ వామచే దసమోసయా.

18. పరేపచాసి సుయధారపవ శ్ఘు అసంపయాసా భికిసు సేస భాభవి యే పేవమే.

19. భా రేకసి యాహావంస ధానీపసధారి నా సేయాభా యధారపసథగ సాప.

20. వసధపచ అభచాసి యిపయ.

21. ఖాయధన ఆయాపింనవా.

పై శాసనములలోని యక్షరములన్నియు సుస్పష్టముగా నున్నను పంక్తి లొకదానిలోని కొకటి సంక్రమించియుండుటచేత నొక పంక్తిలోని యక్షరములు మఱియొక పంక్తిలోనివిగాఁ జెరుపఁబడినవేమో యను సందేహము గలుగుచున్నది కావున నీ శాసనము సర్థమును వివరింపలేదు. పై శాసనములకును నాసికయందలి శాసనములకును గల ముఖ్యభేదము శేషములు లకారములుగా మాఱుటయని గుర్తింపవచ్చును. ఈమార్పు పైశాచీ మాగధీ భాషలకుఁ బ్రత్యేకలక్షణముగా లాక్షణికులు చెప్పియున్నారు.

సంస్కృతములోని చాల నక్షరములు లోపించుటయు నేకపదమునందే యచ్చులు ప్రత్యేకముగ నెట్టి యాగమాక్షరములు లేకుండఁగను, సంధి కాకుండఁగను వ్రేలాడుచుండుటయు లాక్షణికులు దెలిపిన మాహారాష్ట్ర్యాది ప్రాకృతములందు గానవచ్చును. కాని వ్యవహారమునం దాయచ్చులకు సంధి యగుటయో వాని మధ్యమున నాగమహల్లులు చేరి వానిని బంధించుటయో సంభవించెను. ఇట్టిమార్పులు జరిగిన భాషలలో నర్ధమాగధి, జైనమాహారాష్ట్రి, జైనశౌరసేని, పాలి, యనునవి ముఖ్యములు. వీనిలో నర్ధమాగధి, జైనమాహారాష్ట్రి, జైనశౌరసేని, యను భాషలయందు జైనమతగ్రంథములు విస్తారముగ వెలువడినవి. పాలిభాషయందు బౌద్ధమతగ్రంథములు వెలసినవి. వీనిలో గ్రంథస్థములైన భాష స్థిరమై, లక్షణబద్ధమై చాలవఱకు మాఱకుండ నిలిచి పోయినది. కాని వ్యవహారమునందలి భాష నానాఁటికిని మార్పునొందుచునే యుండెను. దక్షిణహిందూదేశమున నించుమించుగ క్రీ. శ. 6-వ శతాబ్దము వఱకును బ్రాకృతభాషలు తప్ప నితరభాషలు ప్రచారములో నుండినట్లు గానరాదు. తమిళభాష క్రీస్తునకుఁ బూర్వమునుండియుఁ బ్రచారములో నుండెడిదను నభిప్రాయము నేడు విడనాడఁబడుచున్నది. క్రీస్తుశకము 6, 7 శతాబ్దములవఱకు ద్రావిడ భాషలలో సంవత్సరములు నిరూపింపఁబడిన శాసన

ములు గాన్పింపవు. క్రీస్తుశకము 4, 5, శతాబ్దములనుండియుఁ బల్లవరాజుల కాలమున సంస్కృతమునకుఁ బ్రాధాన్యముగలిగి ప్రాకృతముల ప్రచారము వెనుకపడినట్లు గాన్పించును. ఈలోఁగాఁ బ్రాకృతము మార్పుఁజెందుచు వచ్చెను. దానికిని నితరభాషలకును వ్యవహారమునఁ దొలుతనుండియుఁ గలుగుచుండిన సంపర్కమువలన గ్రంథస్థలాక్షణిక ప్రాకృతమని గుర్తింపరాని యొక యవస్థ యేర్పడెను. ఈ తొల్లింటి ప్రాకృతమే మార్పునొందుచు నేఁటి యాంధ్రభాషగాఁ బరిణమించినదా? అట్లైనచో నా పరిణామక్రమ మెట్టిది? ఆ ప్రాకృతభాషా స్వరూపమెట్టిది? దానితో మేళనముఁ బొందిన యితర భాషల స్వరూపమెట్టిది? ఆంధ్రమునకును నితర ద్రావిడభాషలకును గల సంబంధమేమి?—అను విషయములను గూర్చిన చర్చ యీ గ్రంథమున నందందు గాన్పింపవచ్చును. ఆంధ్రము ప్రాకృతభాషా వికారమగునేమో యను దృష్టితో నీగ్రంథము వ్రాయఁబడుటచేఁ బ్రాకృత భాషలగూర్చిన ప్రశంస యిందెక్కువగాఁ గాన్పించును.

ఈభాష కాంధ్రమను పేరు నన్నయభట్ట రచితమైన నందంపూడి శాసనమునఁ దొలుతఁ గానవచ్చుచున్నది. అందాతఁడు నారాయణభట్టు నాంధ్రభాషాకవీశ్వరునిగాఁ బేర్కొనియున్నాఁడు. ఆనాఁటికే యీభాషకుఁ దెనుఁగను నామము గుదురుకొనియుండెను. భారతమును తెనుఁగున రచింపుమని రాజరాజు తన్నుఁ గోరినట్లు నన్నయభట్టు చెప్పియున్నాఁడు. ఈ తెనుఁగను పదము స్వరూపమునుగూర్చి విచారింతము.

తెలుఁగనుపదము త్రిలింగ శబ్దభవమని పండితుల యభిప్రాయము. ద్రాక్షారామ, శ్రీశైల, కాళహస్తులను మూఁడు ప్రసిద్ధ శైవక్షేత్రములకు నడుమనున్న దేశము త్రిలింగమనియు నదియే తెలుఁగుదేశమనియు నప్పకవి చెప్పియున్నాఁడు. అంతకుఁబూర్వము కాకతీయులు రాజ్యముచేసిన దేశమునకుఁ ద్రిలింగమని యనుకొనుచుండినట్లు విద్యానాథ కవికృతమగు ప్రతాపరుద్రీయమునఁ బ్రతాపరుద్రుఁడు త్రిలింగాధిపతియని చెప్పఁ బడుటచేఁ దెలిసికొనవచ్చును. అంతకుఁ బూర్వము తెలుఁగుదేశమునకుఁ ద్రిలింగసంజ్ఞ యుండెనో లేదో తెలియదు. శాసనములం దీదేశమునకు తెలింగ, తెలుంగ, తిలుంగ, తిలంగ, తెలగ, తిలింగ, యను పేళ్లు గానవచ్చుచున్నవి. శా. 1194 ప్రాంతముల రాజ్యమేలిన యాదవరాజగు రామచంద్రునికి "తెలింగ తుంగ తరూన్మూలన దంతావల" యను బిరుదముండినట్లు తెలుపఁబడినది. కుంతల దేశాధీశుఁడగు రాచమల్లదేవునకుఁ దెలగలమారి యను బిరుద ముండెను.

" పశ్చాత్పురస్తాదపి యస్య దేశౌ
ఖ్యాతౌ మహారాష్ట్ర కలింగసంజ్ఞౌ
అవాగుదక్ పాండ్యక కన్యకుబ్జౌ
దేశస్స తత్రాస్తి త్రిలింగనామ
పురా త్రిలింగాన్ ప్రతిమంచి కొండా
వాహానయన్ నాయకవంశ ముఖ్యౌ
తాభ్యాం వినిర్మాపితమాత్మ నామ్నా
పురం మహచ్చ ప్రథితేంద్ర దేశే"

అను శ్లోకము ఎపిగ్రాఫియా ఇండికా 14-న సంపుటమున వ్రాయఁబడియున్నది. శా. శ. 1539 సంవత్సరమున మీనసగ గండికోట గారిసాలువ తెలుంగురాయఁడుండినట్లొక శాసనమువలనఁ దెలియుచున్నది. ప్రతాప రుద్రీయమున త్రిలింగశబ్దము వాడఁబడియున్నది. అల్లాఉద్దీనను తురుష్క రాజు తిలంగ దేశమును జయించినట్లు తెలియుచున్నది. తెలుంగు బిజ్జలుఁడను వాఁడు నెల్లూర రాజ్యమేలిన తెలుఁగుచోడుల వంశములోని వాఁడు. ఈ రీతిగా నున్న దేశపుపేళ్లను సంస్కృతీకరించి త్రిలింగశబ్దమును పండితులు కల్పించి నారని యనుకొనుట కవకాశమున్నది.

తెలుఁగుశబ్దము త్రినగశబ్ద భవమని మఱికొందఱందురు. మహేంద్రము, శ్రీశైలము, కాళహస్తి యను మూఁడునగముల మధ్యనున్న ప్రదేశము త్రినగదేశమనియుఁ ద్రినగశబ్దమే తెనుఁగుగా మాఱినదనియు వారి యభిప్రాయము. త్రినగశబ్దమునందు లేని యనుస్వారము తెనుఁగుశబ్దమునం దుండుటయు, తెనుఁగుదేశమునకుఁ ద్రినగిమను వ్యవహార మేనాఁడును లేకుండుటయు నీ వ్యుత్పత్తి కాధారము లేనట్లు తెలుపఁగలదు.

త్రికళింగ శబ్దభవము తెలుఁగని మఱికొందఱనుచున్నారు. త్రికళింగశబ్దము ప్రాకృతమున 'తిఅలింగ' యని మాఱి తలింగ, తేలింగ యను రూపములను పొందుట సాధ్యమేయయినను తెనుఁగుదేశమంతటికిని త్రికళింగసంజ్ఞ లేకుండుటచే నీ వ్యుత్పత్తియు నిరాధారమగుచున్నది. త్రికళింగమనున దిప్పటి గంజాము, విశాఖపట్టణము జిల్లాలును వానికి పడమట మధ్య పరగణాలలోని కొంతభాగమును నయి యుండెను. నేటి ముఖలింగమున్న ప్రదేశమునకు మోదోగలింగే యను పేరు గ్రీకు చరిత్రకారుల వ్రాఁతల యందుఁ గాన్పించుచుండుటచే మోదో అనగా మూఁడగు అని అర్థము చెప్పకొని త్రికళింగమునకు మూఁడగు కళింగమని యర్థముచెప్పి యాత్రికళింగ శబ్దమునుండి తెలుఁగను పదము పుట్టినట్లు కేంబెల్ మొదలగు పాశ్చాత్యు

పండితు లభిప్రాయపడిరి. మోదోగలింగ మనునది మధూకలింగ శబ్దభవము గాని మూఁడుగు కళింగము అనుదాని మారురూపము కాదు. మూఁడగు కళింగమని త్రికళింగమని కన్నడమున వ్యవహారము లేదు.

~~తేనె + లుగు, లుగా~~ తేనెవలె తియ్యనిదగుటచే తెనుఁగయ్యెనని కొందఱును తేట + ఁగు = తేటఁగయ్యెను, లేక స్వచ్ఛమగునట్టిది కావున నీ భాషకుఁ దెలుఁగను నామము వచ్చెననియుఁ గొందఱి యభిప్రాయము. ఈ వ్యుత్పత్తి కేవలము స్వాభిమాన పూరితమని వేఱె చెప్పనక్కఱలేదు. తెన్ అనగా దక్షిణమని అరవమున అర్థము గావున దక్షిణదేశపు భాషగావునఁ దెనుఁగను పేరు గలిగినదని కొందఱనుచున్నారు. తమిళులకుఁ దెలుఁగువారు ఉత్తరమున నుండుటచేతను, తెలుఁగువారు తమ్ము దక్షిణదేశపు వారమని చెప్పకొనుట యసంభవ మగుటచేతను నీ వ్యుత్పత్తికూడ సమంజసముగ లేదు.

కన్నడకవియగు నృపతుంగుఁడను రాజు తాను రచించిన కవిరాజమార్గమను లక్షణగ్రంథమున గోదావరినుండి కావేరివఱకుఁగల ప్రదేశమంతయుఁ గర్ణాటకసంజ్ఞను గలిగియున్నదని చెప్పియున్నాఁడు. కన్నడమునం దాదికవులగు పంప, పొన్న, రన్న, యనువారు వేంగిదేశవాసులయినట్లు వారి గ్రంథములవలనఁ దెలియుచున్నది. ఇంతేకాక పూజ్యపాదుఁడు (క్రీ. శ. 470) దండి (క్రీ. శ. 7-వ శతాబ్దము), నాగార్జున (క్రీ. శ. 8 శతాబ్దము), నాగవర్మ (క్రీ. శ. 990), రాజాదిత్య (క్రీ. శ. 1120), మైదునరామయ్య (క్రీ. శ. 1160), మాళిగియ్య (క్రీ. శ. 1160), మహాదేవ (క్రీ. శ. 1160), మల్లికార్జున పండితారాధ్య (క్రీ. శ. (1160), హరీశ్వర, రాఘవ, కెరెయపద్మరస (క్రీ. శ. 1165), చక్రపాణి రంగనాథ (క్రీ. శ. 1195), పోలాళ్వ దండనాథ (క్రీ. శ. 1223), భీమకవి (క్రీ. శ. 1369),—వీరును నిట్టివారు మఱికొందఱును తెనుఁగుదేశపువారై కన్నడమున గ్రంథములను రచియించియున్నారు. ఓరుగంటియందును హంపీ - విజయనగరమునందును రాజులు తెలుఁగు కన్నడముల నొక్కరీతిగఁ బ్రోత్సహించియుండిరి. శ్రీనాథుఁ డానాఁటి వాడుకను బట్టి కాబోలు తెలుఁగును కర్ణాటభాష యన్నాఁడు. ఇట్లే కన్నడదేశమునందును తెనుఁ గెక్కువ ప్రచారములోనున్నది. నేఁటి కర్నాటక దేశమగు మైసూరు సీమయందలి కోలారు, బెంగుళూరు, చిత్రదుర్గము, నందిదుర్గము జిల్లాలయందు చాలవఱకుఁ దెలుఁగే ప్రచారములోనున్నది. దీనిఁబట్టి కన్నడమువారును తెలుఁగువారును మొదటినుండియుఁ గలసియుండుటయేకాక యొకరిభాష నొకరు బోధపరుచుకొనఁ గలిగియుండిరని యూహింపవచ్చును.

ఈ రెండుజాతులవారికిని ప్రాఁతనలెనే భాషయు నొక్కటిగనె యుండ నోపును. ఆచార వ్యవహారములందును మతాచారసంప్రదాయములందును నీరెండు జాతులవారికిని నొకరీతి యైక్యముండినట్లుగల [illegible] చును. కన్నడ భాష యయిదువిధములుగా నున్నదనియు [illegible] వెళు గన్నడమను వ్యవహారమున్నదనియుఁ, [illegible] తమ మూలస్థానమునువిడిచి దూరదేశములకుఁ బోయి [illegible] నీరీతిగా నుచ్చరించుటవలనఁ గలిగినభాషయనియు, [illegible] చెప్పి యున్నాఁడు. ఇట్లే "కుండ" అనగా [illegible] భాష కుడ గన్నడమనియు, కుడగన్నడమే [illegible] వ్యవహార మందున్న దనియుఁ జెప్పుచున్నారు. ఈ సాదృశ్యమును [illegible] గన్నడము తెలుఁగుగా వ్యవహరింపఁ బడుచున్నదని [illegible]. శబ్దజాలము నందు దెలుఁగు కన్నడములకు నూటికి డెబ్బదివంతులు [illegible] నున్నది. అట్లే ప్రత్యయాది సంబంధమును మిక్కిలి దగ్గఱగానున్నది. [illegible] చేతఁ దెలుఁగు కన్నడము లొకనాఁ డేకభాషగా నుండెననియు కాలక్రమమున మాండలిక భేదమునుబట్టి యవి భిన్నములైనవనియు నూహించుట కవకాశము గలదు.

తెనుఁగు శబ్దములోని గుప్రత్యయమును గూర్చి [illegible] చేయవలసి యున్నది. గు, కు, క, గ, క్, గ్, ంక్, ంగ్, క, [illegible] ప్రత్యయము లంత మందుగల భారతీయ భాషలనుగూర్చి [illegible] తెలుఁగు శబ్దమునందలి గుప్రత్యయ తత్త్వము [illegible]. [illegible] దేశ భాషలలోఁ గన్నడమునకు "హవిక" యను మఱియొక పేరున్నది. తమిళము కొన్ని ప్రాంతములలో "సొలగ" లేక "[illegible]" యను పేరఁ బిలుతురు. "పుల్ రంగ్" అనునది తమిళభాషామాండలిక భేదముగు [illegible]భాషకు మఱియొక పేరు. నీలగిరులలోఁ దమిళభాషా భేదమగు [illegible] "ఎరిల గారు" అను మఱియొకపేరున్నది. తమిళభాషాభేదమగు [illegible] భాషలో "ఎర్నగ" లేక "సింగ్లి" యనుపేరున్నది. [illegible] "[illegible]-గు", కోటా-కూ అనియు కొరగ, కొరియా, కూరియా, [illegible], యనుపేళ్లు గూడ నున్నవి. బడగభాషయనునది కన్నడభాషావికారము. [illegible] బడిక్ అని కూడనందురు. కొడగుభాష కన్నడభాషావికారము. [illegible] నునది తెనుఁగుతో సంబంధించిన "కుయి" అను భాషకు మాండలికభేదము. "[illegible]య్ లోంగ్" అనునది కోంకణీ మళయాళభాషల సమ్మేళనము [illegible] గలిగినది. భత్కల్, బుత్కల్ అనుభాష మరాఠీభాషావికారమైన కోంకణీభాషా భేదము. "ధనగరీ" యనునది మరాఠీభాషకు మాండలిక రూపము. ఇట్లే

డేపరుక్, కౌంగ్ షౌంగ్, ఘోతిగ, యనునవి గూడ మరారీభాషా వికారములే

టిబేటు దేశములోని భోటియా మండలమునందు గ్యారూంగ్, కైగిలి, ఙాన్జొంగ్-కా, యను భాషలున్నవి. ఇఁక బర్మాదేశములోఁ జాల వఱకు భాషలు కంఠ్య వర్ణాక్షరాంతములుగాఁ గానఁబడు చున్నవి. ఉదాహరణములు:—ఘేక, గరు, గురు, హిరోఇలమ్‌గాంగ్, గన్నగ, హ-అంగ్, హ్మాంగ్, హ్సౌంగ్, హానోమైంగ్, హానోమోంగ్, హానోర్ త్సెంగ్, హ్రాంగ్-ఖోల్, ఇబంగ్, ఈపంగ్, జక్ తుంగ్, హు అల్నగో, క-హాంగ్, కంగ్, కత్ లంగ్, ఖా-లోంగ్, ఖుగ్-నాన్, ఖుగ్నీ, ఖులుంగ్-ముదున్, ఖుకెలోంగ్, ఖ్యాంగ్ (చ్యాంగ్), ఖ్యాంగ్, క్లుస్ లోంగ్, ఖానుంగ్, నుంగ్, కోమ్‌రోంగ్, కోల్హా రెంగ్, కోతంగ్, కుకెలోంగ్, క్విన్ పంగ్, కోవోయ్ రెంగ్, (లీయాంగ్), లకూ, లల్లెంగ్, లాలుంగ్, లంగ్రోంగ్, లంగ్ తుంగ్, లథంగ్, లాక్ లంగ్, లెంగ్ రెంగ్, మాంగ్, లోంగ్, మోపాంగ్, మ్రుంగ్, ములుంగ్, ముంగ్, ముంతుక్, సమెసంగ్, సరింగ్, పల్లంగ్, పల్లెంగ్, ఫడంగ్, ర-అంగ్, రాబ-కెవ్వంగ్, రెవంగ్, రేఅంగ్, రి-అంగ్, రోంగ్, రుబ్రంగ్, సైంగ్ బౌంగ్, సెరంగ్, సెంటెదౌంగ్, సెంతుంగ్, షైయాంగ్, తౌంగ్-ఖుల్, షామ్ తురూంగ్, సిన్లెంగ్, సీయంగ్, సొంగ్ లోంగ్, స్తీఎంగ్, తఅంగ్, తబైంగ్, తబౌంగ్, తశ్లెంగ్, త్రైచౌంగ్, తైఖౌంగ్, తపోంగ్, తరేంగ్, తవ్ హ్వాంగ్, తయంగ్, తియింగ్, త్లంత్ లంగ్, త్విలిఛంగ్, వెలౌంగ్, యబైంగ్, యకైంగ్, యస్లెంగ్, యమలంగ్, యంగ్ కా లెంగ్, యెమ్‌పాంగ్, రి అంగ్, అంగ్‌క, అక, ఆక, ఆంగ్ కూ, ఆంగ్ వాస్-కూ (తబ్లెంగ్) అనుంగ్, నుంగ్, ఖునుంగ్, అయైంగ్, బెయ్యూ, బోక, ద-అంగ్, ద-ఎంగ్, దరాంగ్, పతాంగ్, దిగారు, దులేంగ్.

ఈ క్రిందిభాషలు టిబెటో- బర్మనుభాషా వర్గమునకుఁ జేరినవి:— గురుంగ్, పిదంగ్, లీయంగ్, లోయ్‌లోంగ్, మంగ్, తోంగ్, లోంగ్, మ్హాంగ్, ఆర్లెంగ్, అరుంగ్, ఎమ్పేన్ ఛేపాంగ్, ఛిన్ బోక్, చ్యాంగ్, ఖ్యాంగ్,

ఈ క్రిందిభాషలు అస్సాము దేశములోనివి:—థేకేరీ, ఛిబోక్, డైకో, ఖంగోయ్, కోస్యక్, మయాంగ్, మిలెననంగ్, మింఛాణంగ్, మియాంగ్ ఖంగ్, మూజుంగ్, వనాంగ్, అస్సిరింగియా, అసురింగ్, ఆతింగ్, ఆతోంగ్.

ఈక్రింది భాషలు నేపాళదేశములోఁ వ్యవహారములో నున్నవి:— ఛింగ్ తాంగ్, గోర్ ఖాలీ, గోర్ఖియా, ఖాలింగ్, కూలుంగ్, ఖాంబూ, వాలింగ్, ఖంబూ, బాహింగ్.

ఉత్తర హిందుస్థాన భాషలలో ఓఢ్ర భాషావికారములగు [illegible]లో, బంగాలి, ఉత్కలీ భాషలును, తూర్పు హిందీభాషావికారమగు "కలంగ" భాషయును పశ్చిమ హిందీభాషావికారములగు [illegible], [illegible] భాంగ్, డాంగీ, భాషలును, బంగాళము, ఒరిస్సా, [illegible]ము, [illegible] దేశములలో సంచారశీలురగు నొకజాతివారి [illegible] "[illegible]" భాషయును, బంగాళాదేశములోని బంగ, [illegible], [illegible], [illegible]గా, భాషలును, మార్వాడీ భాషావికారములగు [illegible], [illegible], [illegible] భాషలును, నిట్టి ప్రత్యయములనే కలిగియున్నవి. [illegible] భాషా వికారము. అవాంకారీ, అవాంకీ, అనుభాష [illegible]లలోని కోహాత్ జిల్లాలోనిది. ఇది లహంబా భాషా[illegible]. [illegible]నుభాష హిమత్పర్వత పాదమునందలి పహాడభాష[illegible] [illegible]కానీ భాష యంతర్భాగము, మంగిరీ, [illegible], [illegible]యలో ప్రచారమున నున్నవి. పశ్చిమో[illegible] భాషయందుఁ గూడ నీ ప్రత్యయము కనఁబడుచున్న[illegible] కాశ్మీర ప్రాంతమునందలిది. ఙ్గాంగ్, [illegible], [illegible], [illegible], [illegible] అనునవి ముండా భాషావిశేషములు.

బర్మాలో తలైంగ్ అనునొక భాషయున్న[illegible]. [illegible] భాషా కుటుంబమునకుఁ జేరిన మాన్-[illegible]. దీనిని మాట్లాడువారి సంఖ్య 224424. ఇది బర్మాలోని [illegible] జిల్లాలోఁ బ్రచారముననున్నది. తలైంగ్-కలసీ యనునొక భాష బర్మాలోని [illegible]మే ఘిను జిల్లాలో వాడుకయందున్నట్లు తెలియుచున్నది. [illegible], అను మఱియొకభాష బర్మాలోని చాలజిల్లాలలో [illegible]చున్నట్లును దానిని 352466 మంది మాట్లాడుచున్నట్లును బర్మాదేశపు జనాభా లెక్కల వలనఁ దెలియుచున్నది. బర్మాలోని యుత్తరభాగమున [illegible] అనునొక భాషను 18074 మంది మాట్లాడుచున్నారట. [illegible] దేశములో తురాంగ్ అను మఱియొక పేరుగల [illegible] భాషయున్నదట. [illegible] దేశములో థూలుంగ్ అనునొకభాష మాట్లాడఁబడుచున్నది. బర్మాలోని తలైంగ్ దేశమునకును తెలుఁగుదేశమునకును చిరకాలమునుండి వాణిజ్య సంబంధముండినట్లు బర్మాదేశపు చరిత్రమువలనఁ దెలియఁగలదు. [illegible] తెలుఁగు భాషకును తలైంగ్ భాషకును నేఁటికి సంబంధమును [illegible] దానిని కనిపెట్టుటకు వీలులేకున్నది. నేఁడు ప్రిజులిస్కీ మొదలగు పండితులు ఆస్ట్రిక్ భాషలకును ద్రావిడభాషలకును సంబంధమున్నట్లు తెలియఁజేయుచుఁ దద్విషయమై పరిశోధనములఁ గావించుచున్నారు. పరిశోధనముల మూలమున

ద్రావిడభాషలకును ఆస్ట్రిక్ భాషలకును కొన్ని సంబంధములు నిరూపింపఁబడినవి. ఈ పరిశోధనములవలన నీరెండు భాషాకుటుంబములకును సంబంధమేర్పడిన యెడల నాస్ట్రిక్ భాషలకే సంబంధించిన తైలైంగ్ భాషకును తెలుఁగుభాషకును సంబంధ మేర్పడవచ్చును. ఆసంబంధము తేలువఱకును నీ విషయమై ఇదమిత్థమని చెప్పుటకు వీలు లేదు.

పైని వివరించిన గుప్రత్యయ విచారమునకు సంబంధించిన యొక విశేషము గలదు. ప్రాకృత వైయాకరణులు పైశాచీభాష కాంచీ, పాండ్య, పాంచాల, గౌడ, మాగధ, వ్రాచడ, దాక్షిణాత్య, శౌరసేన, కైకయ, శాబర, ద్రావిడ, బాహ్లీక, సహ్య, నేపాళ, కుంతల, గాంధార, సుదేష్ణ, భోట, హైవ, కనోజన, దేశములయందుండునదని వివరించిరి ఆర్యభాషలయందు ముండా, ద్రావిడ, భాషల సంబంధమువలన గలిగిన భాషావిశేషములే పైశాచీ భాషలుగాఁ బరిణమించి యుండవచ్చునని హోయర్ నెల్, సెనార్టు, పండితు లభిప్రాయపడుచున్నారు. ఇంతకుముందు గుప్రత్యయాంతములుగా వివరింపఁబడిన భాషలన్నియు పైశాచీభాషా ప్రదేశములందలివని ప్రాకృత వైయాకరణులు తెల్పిన ప్రదేశములందే సరిగానుండుట విచిత్రముగా నున్నది గుణాఢ్యుఁడు బృహత్కథను పైశాచీభాషయందు వ్రాసియుండెనను ప్రతీతియందు సత్యమున్నచో నాంధ్రభాష పైశాచీభాషా విశేషమై యుండవచ్చును ఈ యూహాల కాంధ్ర వైయాకరణుల యభిప్రాయమును దోడ్పడుచున్నది ఇందువలన తెనుఁగుభాష నేఁడుగూడ కేవలము పైశాచీభాషతోనే సంబంధించినదని యనుకొనఁగూడదు. ఒక భాషయొక్క చరిత్రయందు ఎన్నో మార్పులు కలుగుచుండును. తనతో సంబంధించినట్టియు సంబంధింపనట్టియు నెన్నో భాషలతో దానికి సంపర్కము కలుగవచ్చును. అందుచేత నా భాష కేవలము మూలభాషా రూపముననే నిలిచియుండుట యసంభవము. అయినను నది మూలభాషా సూత్రముల ననుసరించియే మార్పులను బొందుచుండును. ఈ విషయమై తెనుఁగునకు సంబంధించినంత మట్టుకు మఱియొకచోట వివరింపఁబడును.

తెనుఁగుశబ్దమునుగూర్చి విచారించునపుడు భరతవర్షమునకుఁ దూర్పు తీరమున వరుసగా సంగ, వంగ, కళింగ, తెలింగ, దేశములున్నవను విషయము గోచరింపక మానదు. కలింగయనగా నెత్తైనదేశము, తెలింగ యనఁగాఁ బల్లపు దేశమనియుఁ గళింగ తెలింగములు వాస్తవముగ నొక్కటే దేశమనియు, గొందఱు చెప్పుదురు. కళింగాంధ్రములకు భాషయొక్కటియే యని కుహార్జ్ పండితుఁ డభిప్రాయ పడియున్నాఁడు. కలింగదేశపు బౌద్ధగ్రంథముల భాషయు

నాంధ్రదేశమునకు సంబంధించిన బౌద్ధమత గ్రంథమగు అట్ఠకథలోని భాషయు నొక్కటియే యయియుండు టీయూహాకాధారము.

గ, గు, ప్రత్యయములు సంస్కృతములోని క ప్రత్యయమునకుఁ బ్రాకృతభాషా వికారములని చెప్పుట కవకాశమున్నది. మానిగి, గోసిగి, ఓడంగి, కోణంగి, పడ్రంగి, మొదలగు శబ్దములలోని ప్రత్యయములు సంస్కృతములోని క, కి, ప్రత్యయ వికారములే. మధ్యపరగణాలలోని తేల్ నదీ ప్రాంతమునుండి వచ్చినవారగుటచే తెలుఁగులను నామము కలిగెనని కొందఱు చెప్పుదురు. తైలికశబ్దభవము తెలుఁగని కొందఱి యభిప్రాయము. తెలివిగల వారు కావున తెలుఁగులను పేరు గలిగెనని కొందఱందురు. తెలుఁగు అను పదము సంస్కృతములోని ధవల, తృప్త, దృప్త మొదలగు శబ్దముల ప్రాకృతవికారము, కావచ్చును ఈ వ్యుత్పత్తులన్నియు నూహామాత్రములు. తెలుఁగుశబ్దము వ్యుత్పత్తినిగూర్చి ఇదమిత్థమని చెప్పుటకు నేటికిఁదగిన యాధారములు లభింప లేదని మాత్రము చెప్పి యింతటితో విరమింపవలసి యున్నది. ఈ విషయమై "జనపదేలుప్; తదశిష్యం సంజ్ఞాప్రమాణత్వాత్." "లుబ్యోగా-ప్రఖ్యానాత్" "యోగప్రమాణేచ తదభావేఽదర్శనం స్యాత్," "ప్రధాన ప్రత్యయార్థవచన మర్థస్యాన్య ప్రమాణత్వాత్," అను పాణిని వచనములను స్మరింపవలసియున్నది.

తెనుఁగు భాషకుఁ దమిళదేశమునందు వడుగ, బడుగ, యను పేర్లున్నవి. పోర్చుగీసువారు తెనుఁగును బడగేస్ అని పిలుచుచుండిరి. జర్మనులు దానిని వరుగ యనిరి. ఐరోపియనులు తెనుఁగును జెంటూ భాషయని పిలుచుచుండిరి. ఈపదము పోర్చుగీసు శబ్దమగు జెంటియో, (అనఁగా మ్లేచ్ఛుఁడు, క్రైస్తవేతరుఁడు) అనుపదమునకు వికారము.

తెలుఁగునకు సంబంధించిన కొన్ని వికార రూపములనుగూర్చి యింతకుఁ ముందుఁ దెలుపఁబడినది. వానికీ క్రింది యుదాహరణములు లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా 4-వ సంపుటమునుండి తీసికొనఁబడినవి.

---

## కోంటావుభాష.

---

ఒక మనిషికి యిద్దఱు పిల్లగాండ్లు వుండిరి. వాండ్లలో చిన్నవాడు తండ్రితో అంటాడు, "తండ్రి, యేదో మాలమతట నాకు వచ్చేసలది అది యివ్వు" వెనకవాఁడు పిల్లనికి ధనము పంచి ఇచ్చిండు. వెనక కొన్ని దేవసాలకు చిన్నపిల్లడు అంత సొమ్ము జేమాజేషి దూరదేశానకు పోయిండు

యింక అక్కడా అవిచారముతో నడ్చి తన సంపత్తు పాడుగొట్టినాడు. తర్వాతా వాఁడు అంతా వ్రెచ్చిసంక ఆ దేశములో లావుకరువు బడది. అందుకు, వానికి కఠినము బడది, అప్పుడు వాఁడు దేశములో ఒక్క మనిషి దగ్గిర పోయి వున్నడు వాడే తేను వాని పందులు కాపేకొరకు తన చేండ్లోకి తోల్లాడు. అప్పుడు పందులు తినేది పట్టుతో వాడు తన పొట్ట నింపుకోవలె అని వానికి అనిపించింది, యింకా యెవ్వరు వానికి యివ్వలేదు తర్వాతావాఁడు తెల్వి మీదికివచ్చి అన్నాడు; మాతండ్రి యింట్లో యెందరు సవుకిలలకు పుష్కళంగా అన్నం వున్నది, యింకా నేను ఆకలితో చేస్తా నేను లేశి నా తండ్రి దిక్కుకు పొయ్యేను. వానితో అనేను, "ఓతండ్రి, నేను యీశ్వరుని విరుద్ధం నీముందర పాపం జేసినాను, యిక్కడినుంచి నీ కొడుకును అనేటందుకు నేను యోగ్యని కాను. నీ ఒక్క నౌకరివానివలె నన్ను వుంచు."

---

## కామాఠీభాష.

---

వక్క మనశికి ఇద్దరు కొడుకులు ఉండుండ్రి. చిన్నోడు తండ్రికి అంటడు "అయ్యా, నా అంతుకు యేమి జిందగి అస్తది అది నాకు ఇయ్యానా." మరి తాను అది ఇద్దర్కి పంచి ఇచ్చిండు తోడ్యం దినాల్లు కాలే, ఇంతట్లా చిన్నకొడుకు తనది అంత హిస్స జేమాచేసి దూరం దేశంకు యెల్లిపోఇండు. అకి అంత ముల్క మజేలా యగరకొట్టిండు. యప్పుడు అంత ముల్క యగర గొట్టిండు అప్పుడు ఆ ఊరగల్యాకా పెద్దకాలం పడింద్యా అప్పుడు తనకు తిండికి మూతాడు ఆయా. మరలా ఆడు ఆ ఊరల్యా దండొక్యడు దగ్గిరపోఇ ఉండ్యా. మరి ఆడు ఆడ్కి తన శేనులా పందులు మేపతనకు తోలిండు. పందులు తినేటి పొట్టు తిని పొట్టనింప తనకు తాను కబుల్ ఆయా గని అది బీ యస్వరు ఇయ్యరు. యప్పుడు ఆడు సుద్దిమిద అచ్చా. అప్పుడు మనసులా అనుకుండ్యా, "నా అయ్యా ఇంట్లా యంతమంది నౌకిర్ చేశి సుకంగా పొట్ట నింపుకుంతరు, ఇంకా నేను ఇడ ఉపాసం సస్తా. నేను ఇప్పుడు లేశి నాతండ్రి దగ్గర పోతా. ఇంక నేను ఆడ్కి అనేను, "అయ్యా, మీంది వ దేవరుదీ అపరాధీ ఉన్నాను. దానికోసంకి మీకొడకు అనపించు కునతందుకు లాయక్ కాను. నీవు నాకు నౌకరోడు మేరగా ఉంచు" అప్పుడు లేశి తండ్రి దగ్గర్కి పోయా. ఆడ్కి దూరంకెల్లి కొడకు రాంగా తండ్రి సూశా. ఇంక గోశావచ్చి తండ్రి ఉర్కి అల్లుకున్యా. ఇంక ఆడికి ముద్దిచేసున్యా. మరలా కొడుకు తండ్రికి చప్యా, "అయ్యా, నీ ముంగట నేను సామిది

